# "ఆంధ్రరాష్ట్ర శాశ్వతరాజధాని గుంటూరు సమీపంలో పెట్టడమే ఉత్తమం"

## రాయలసీమవారు కాదంటే తిరుపతి వీలుగా ఉంటుందని వాంచూ సిఫార్సు

## మద్రాసు నగరంలోని భవనాలకుగాను 230.4 లక్షల రూపాయలు ఆంధ్రులకు పరిహారం ఇవ్వాలని శ్రీ వాంచూ నివేదిక

న్యూఢిల్లీ, మార్చి 26: ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని మూడునుంచీ, ఐదేండ్లవరకూ, మద్రాసు నగరంలో ఉంచాలనీ, క్లిష్టభూయిష్టమైన ఆంధ్ర రాజధాని సమస్యకు యిదే పరిష్కార మార్గమని, రాజస్థాన్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ కైలాసనాథ్ వాంఛూగారు భారత ప్రభుత్వానికి తాము సమర్పించిన నివేదికలో సూచించారు.

అయితే మద్రాసునగరంపై ఆంధ్ర ప్రభుత్వానికి యేట్టి అధికారం ఉండరాదన్నీ, కేవలం అతిథి హోదాలోనే ఉండాలని, యిదేవిధంగా హిమాచల ప్రదేశ్ ప్రభుత్వం సిమ్లాలో ఉంటున్నదని న్యాయమూర్తి వాంఛూగారు వివరించారు.

వాంఛూ నివేదిక, యివాళ మధ్యాహ్నం ప్రధానమంత్రి నెహ్రూ, పార్లమెంటు సభ్యులకు అందజేశారు. ఇది చిన్న అక్షరాలతో ముద్రించబడిన, 56 పుటల నివేదిక. దీనికి ఆర్థికవిషయాలు, తదితర వివరాలకు సంబంధించిన అంకెలు వగైరాలు తెలిపే, మూడు డజను అనుబంధాలు ఉన్నవి.

రాజధాని, పబ్లిక్ సర్వీసు కమీషన్, అవశిష్ట మద్రాసురాష్ట్రంలో, ఆంధ్రులకు విద్యాసౌకర్యాలు, ఉద్యోగుల విభజన, సైటు, సబార్డినేట్ ఉద్యోగులకు, ప్రత్యేకరక్షణ విద్యావిషయం, ఆస్తుల, అప్పుల పంపకం మొదలగువిషయాలు, యీ నివేదికలో కూలంకషంగా చర్చించబడినవి.

నూతన రాష్ట్ర రాజధాని సమస్య అనేక యిబ్బందులతో కూడుకొని ఉన్నట్టిదని, నూతన రాష్ట్ర రాజధానిని తాత్కాలికంగా, మూడేళ్లనుంచీ, ఐదేళ్లవరకూ మద్రాసు నగరంలోనే ఉంచినట్లయితే, యీ సమస్య చక్కగా పరిష్కారం కాగలదని వాంఛూ సూచించారు.

మద్రాసు నగరానికి సంబంధించిన అన్ని విషయాలలో అవశిష్ట మద్రాసు ప్రభుత్వానికే అధికారమని, ఆంధ్ర ప్రభుత్వానికి యేవిధమైన ఆధిపత్యం, అధికారం ఉండరాదని, కేవలం అతిథి హోదాలో ఆంధ్రప్రభుత్వం మద్రాసు నగరంలో ఉండాలని స్పష్టీకరించాలని వాంఛూ పేర్కొన్నారు.

ఈ సూచనను ఆంధ్రేతరులు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారని, ఒకసారి, మద్రాసు నగరంలో, ఆంధ్ర ప్రభుత్వం యేర్పడినట్లయితే దానిని అక్కడి నుంచి కదలించడానికి సాధనము లేదని, వారు భయపడుతున్నట్లు వాంఛూ నివేదికలో ఉదహరించారు.

మద్రాసు తప్ప, మిగతా తెలుగు ప్రాంతాలతో ఆంధ్ర రాష్ట్రం యేర్పడుతుందని ప్రధాని నెహ్రూ స్పష్టంగా ప్రకటించినప్పటికిన్నీ, మద్రాసు నగరంగురించి, ఆంధ్రుల ఆందోళన సాగుతున్నది. అలాంటప్పుడు తాత్కాలిక రాజధానిని మద్రాసులో వుంచితే ఆ ఆందోళన తీవ్రతరమై దుష్ఫలితాలకు దారితీస్తుందని ఆంధ్రేతరుల భయమని కూడా నివేదికలో పేర్కొన్నారు.

### పూర్తిపాఠం

మూడు నుంచి అయిదేండ్లపాటు ఆంధ్ర రాజధానిని తాత్కాలికంగా మద్రాసు నగరంలో యేర్పాటుచేస్తే ఆ తర్వాత ఆంధ్ర ప్రభుత్వం మదరాసు నగరంనుంచి తరలిపోరన్న అనుమానం అతిగా చెప్పబడుతున్నది. ఎందుచేతనంటే ఆ విధంగా యేర్పాటు చేసిన సందర్భంలో మద్రాసు నగరం మీద ఆంధ్ర ప్రభుత్వానికి ఎటువంటి అధికారాలు ఉండవు. కనుక అటువంటి సర్వాధికారాలు వుండే చోటికి పోవాలనే ఆంధ్రప్రభుత్వం ఆకాంక్షిస్తుందని సాధారణంగా అనుకోంటాము. విభజనప్పటికే ఆంధ్ర రాజధానిని మదరాసు నగరంలోనే యేర్పాటుచేసే సందర్భంలో అది కేవలం తాత్కాలికపు యేర్పాటేనని భారత ప్రభుత్వం స్పష్టం చేయవలసివున్నది. ఆ కాలవ్యవధి పూర్తికాగానే ఆంధ్రప్రభుత్వం మద్రాసు నగరం వదలిపోయి యేర్పాటుచేయవలసిన బాధ్యత భారత ప్రభుత్వానిదన్నదని, తాత్కాలిక రాజధాని సమస్య పరిష్కారానికి అందని సమీక్షావనీ న్యాయమూర్తి వాంఛూ తన నివేదికలో వివరించారు.

పోతే ఆంధ్రరాజధాని తాత్కాలికంగా మద్రాసు నగరంలో ఏర్పాటు చేసినట్లయితే మద్రాసు నగరంలోనే ఆంధ్రులు నిరంతరం ఉండాలని సాగిస్తారన్నది ఈ యేర్పాటును వ్యతిరేకించే వారి ముఖ్య కారణం. ఆంధ్రేతరుల ఈ అనుమానం నివారించడానికి వీలుగా, మద్రాసు నగరంలో అప్రీతికరమైన పరిణామాలు పొటమరించే ఆందోళనను ఆంధ్రులు సాగించరని ఆంధ్ర నాయకులు, మద్రాసు నగరంలోని ఆంధ్రేతరులకు నచ్చ చెప్పాలి. ఆంధ్రేతరులకు అటువంటి హామీ యివ్వడానికి ఆంధ్రనాయకులు సిద్ధంగా వున్నట్లయితే, కొంతకాలంపాటు అతిథిగా మద్రాసు నగరంలో వుండదలుస్తున్న ఆంధ్ర ప్రభుత్వం మద్రాసు నగరంలో అప్రీతికరమైన చర్యలేవీ తీసుకోదని కూడా, ఆంధ్ర నాయకులు ఆంధ్రేతరులకు నచ్చ చెప్పాలి. కొంతకాలంపాటు తాత్కాలికంగానైనా ఆంధ్ర రాజధానిని మదరాసు నగరంలో యేర్పాటు చేయడం ఏ కారణంవల్లనైనా సాధ్యంకాక పోయిన పక్షంలో ఆంధ్ర ప్రభుత్వానికి సంబంధించిన కొన్ని ముఖ్య కార్యాలయాలను మద్రాసు నగరంనుంచి మరొక ప్రాంతానికి వెంటనే తరలించడం ఈ సమస్యా పరిష్కారానికి ఒక మార్గం.

### గత్యంతరంలేని పక్షంలో

తాత్కాలికంగానైనా ఆంధ్రా రాజధానిని మద్రాసు నగరంలో ఏర్పాటు చేయడానికి వీలుగాని పక్షంలో చేయవలసిందేమిటనే విషయం గురించి శ్రీ వాంఛూ తన నివేదికలో యిలా సూచించారు.

ఇక వేరే గత్యంతరం ఏమీ లేనిపక్షంలో మాత్రమే ఆంధ్ర శాసనసభ, ప్రభుత్వ కార్యాలయాలు, మరికొన్ని ప్రధాన కార్యాలయాలను విశాఖపట్టణంలో నెలకొల్పాలని శ్రీ వాంఛూ భారత ప్రభుత్వానికి సూచించారు. వివిధ కార్యాలయాలకు కావలసిన భవనాల దృష్ట్యా నేమి, రాకపోకల సౌకర్యాల దృష్ట్యా నేమి తాత్కాలికాంధ్రరాజధాని నెలకొల్పడానికి తగిన పట్టణం మరేదీ ఆంధ్రలో కలిపించడం లేదని శ్రీ వాంఛూ సూచించారు.

నవ్యాంధ్ర ప్రభుత్వం నెలకొన్న మొదటి దశలో ప్రభుత్వ కార్యకలాపాలన్నీ పరస్పర సమన్వయ సహకార దృష్టితో త్వరగా జరుగవలసి వున్నది. వివిధశాఖలు కలిసి పరస్పర సహకారంతో పని చేయవలసి వున్నది. కనుక ఆంధ్రప్రభుత్వ కార్యాలయాలను తాత్కాలికంగా ఆంధ్రలోని పలు పట్టణాలలో అక్కడక్కడ ఒక్కొక్కటి నెలకొల్పే యేర్పాటు పనికిరాదని వాంఛూ నివేదిక తెలియచేస్తున్నది.

### శాశ్వత రాజధాని

శాశ్వతాంధ్రరాజధాని సమస్య విషయంలో, 1937 లో జరిగిన శ్రీబాగ్ ఒడంబడికతో సహా పలు విషయాలను శ్రీ వాంఛూ తన నివేదికలో పరిశీలించారు. శ్రీబాగ్ ఒడంబడిక ననుసరించి రాజధానితో లేక హైకోర్టునో తమ ప్రాంతంలో నెలకొల్పాలని రాయలసీమ ప్రజలకున్నది.

ఆతరువాత తాను సందర్శించిన వివిధ ఆంధ్రపట్టణాలను అర్హతలను, చర్చిస్తూ శ్రీ వాంఛూ శాశ్వతరాజధాని విషయంలో ఇలా పేర్కొన్నారు.

"ఆంధ్రరాష్ట్రంలో ఉత్తర ప్రాంతాన దూరంగా విశాఖ-వాల్తేరు పట్టణమున్నది. శాశ్వతరాజధానికా పట్టణం అనేక కారణాలవల్ల తగివున్నప్పటికీ ఆయేర్పాటుకు రాయలసీమవారు అంగీకరించకపోవచ్చు. దక్షిణాంధ్రలో చాలాదూరాన నెల్లూరు పట్టణం వున్నది. రాయలసీమజిల్లాలకు అపట్టణము దూరం కాకపోయినప్పటికీ రాయలసీమ పట్టణాలలో అదొకటి కాదు. విజయవాడ, బందరు, రాజమండ్రి, కాకినాడపట్టణాలు కృష్ణా గోదావరినదులకు ఉత్తరాన ఉన్నవి. కనుక వాటిలో ఏదో ఒకపట్టణాన్ని శాశ్వతరాజధానిగా యేర్పాటు చేయడము రాయలసీమవారికి కష్టం లేక పోవచ్చు.

"గుంటూరు ఆంధ్రరాష్ట్రానికి కేంద్రంలోవున్నది. కనుక గుంటూరు, కృష్ణానదులమధ్య కృష్ణానదికి దక్షిణ ప్రాంతంలో నవ్యాంధ్ర రాజధాని నేర్పాటు చేయవచ్చు."

ఈ సందర్భంలో గమనించ తగ్గ రెండువిషయాలున్నవని శ్రీ వాంఛూ పేర్కొన్నారు. వేసవిలో గుంటూరులో ఎండలు చాలాతీవ్రంగా వుంటవనేదొకటి. పోతే గుంటూరు సర్కారు జిల్లాలలోనిదైనా రాయలసీమజిల్లాలలోది కాదనేది రెండవవిషయమంటూ శ్రీ వాంఛూ తన నివేదికలో యిలా అన్నారు:

"రాయలసీమ జిల్లాలలో ఒకటయిన కర్నూలుజిల్లాకు చేరువలో గుంటూరున్నది. రాయలసీమవారు అంగీకరించినట్లయితే ఆంధ్రకుకేంద్రంగావున్న ఆ పట్టణంలో రాజధాని నెలకొల్పవచ్చు. వేసవిలో ఎండలు తీవ్రంగా వుంటవనే విషయం లెక్క చెయ్యరాదు. అయితే ఏ కారణంవల్లనయినా శాశ్వత రాజధాని తమప్రాంతంలోనే వుండాలని రాయలసీమవారు పట్టుబట్టినట్లయితే తిరుపతి పరిసరాలలో ఆంధ్ర రాజధాని నెలకొల్పడం మంచిది. అక్కడ ఎండలంత తీవ్రంగా వుండవు. పరిసర కొండలలో నీళ్ళు పుష్కలంగా లభిస్తవి. కనుక శాశ్వత రాజధాని విషయంలో నా మొదటి వోటు గుంటూరు, కృష్ణానదులకు మధ్యవున్న ప్రదేశానికే ఇస్తున్నాను. శ్రీబాగ్ ఒడంబడికను మన్నించవలసి వుంటే చిత్తూరు జిల్లాలోని తిరుపతికి రాజధాని నెలకొల్పే విషయంలో నా రెండవ వోటు."

### హైకోర్టు విభజన

ఆంధ్రహైకోర్టును తాత్కాలికంగా యేర్పాటు చేసే సందర్భంలో ప్రస్తుత మదరాసు హైకోర్టు కార్యక్రమాన్ని అకస్మాత్తుగా మార్చవలసి వుండడం వల్ల ప్రభుత్వోద్యోగుల మీదనే గాక న్యాయవాదుల మీద కూడా కొన్ని బాధ్యతలు పడుతున్నవని శ్రీ వాంఛూ తన నివేదికలో వివరించారు. రాజ్యాంగంలోని 230వ సూత్రం ప్రకారం రెండు రాష్ట్రాలకు ఒకే హైకోర్టు వుండవచ్చు. ఉభయరాష్ట్రాల మధ్య పరస్పరసద్భావం వున్నట్లయితే ఈ విషయంలో తగు యేర్పాట్లు చేయవచ్చు. ఈ విషయంలో శ్రీ వాంచూ తన నివేదికలో ఇలా పేర్కొన్నారు:

"రాజ్యాంగంలోని 23వ సూత్రం వినియోగించుకొని, మద్రాసు హైకోర్టే అయిదునుంచి, పదేండ్లవరకు రెండు రాష్ట్రాలకు సంబంధించిన వివాదాలు పరిష్కరించే యేర్పాటు చెయ్యాలి. న్యాయశాఖోద్యోగుల కంట్రోలు మొదలైన యేర్పాట్లకు వీలుగా ప్రస్తుత మద్రాసు హైకోర్టులో ఆరుగురు ఆంధ్ర న్యాయమూర్తులతో ఒకశాఖ నేర్పాటు చెయ్యాలి. ఉభయులకు ఒకే ప్రధాన న్యాయమూర్తి నేర్పాటు చెయ్యాలి. ఆంధ్రేతర న్యాయశాఖకు అయిదుగురు న్యాయమూర్తులను నియమించాలి.

"హైకోర్టుఆదాయమంతా అవశిష్ట మద్రాసు రాష్ట్ర ప్రభుత్వానికే చెందాలి. అలాగే హైకోర్టు ఖర్చులన్నింటిని అవశిష్ట మద్రాసు రాష్ట్ర ప్రభుత్వమే భరించాలి.

"ఈ పద్ధతిలో ఆంధ్ర న్యాయమూర్తులను అవశిష్ట మద్రాసురాష్ట్ర గవర్నరు సలహాల ప్రకారం నియమించడానికి నవ్యాంధ్ర ప్రభుత్వానికి అభ్యంతరం వుండవచ్చు. అయితే ఆంధ్ర న్యాయశాఖలో ఖాళీలు వచ్చినప్పుడు, ఆఖాళీలను భర్తీచేసే సందర్భంలో అవశిష్ట మద్రాసురాష్ట్ర గవర్నరు, ప్రధాన న్యాయమూర్తులు నవ్యాంధ్ర రాష్ట్రగవర్నరునుకూడా సంప్రతించి, ఆంధ్ర గవర్నరు సలహాల ననుసరించి ప్రధాన న్యాయమూర్తి ఆ విషయంలో చేసే సూచనలను అవశిష్ట మద్రాసు రాష్ట్ర గవర్నరు అమలుజరపాలనే ఆచారం అమలు జరపడంద్వారా యీ అభ్యంతరం తొలగించవచ్చు. ఉభయ రాష్ట్రాలమధ్య పరస్పర సంహృద్భావం వున్నట్లయితే యీ సంప్రదాయం అమలుజరపడం కష్టంకాదు."

ఈ సూచనలు ఆమోదయోగ్యం కానిపక్షంలో ఆంధ్రహైకోర్టును గుంటూరులో తాత్కాలికంగానెలకొల్పమని శ్రీవాంఛూ తననివేదికలోసూచించారు.

ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ఏర్పడినప్పటినుంచీ ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకంగా గుంటూరులో పబ్లిక్ సర్వీసెస్ కమిషను నెలకొల్పాలని శ్రీ వాంఛూ సూచించారు.

శేషించిన మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రులకు కలిగించవలసిన విద్యాసౌకర్యాలనుగురించి శ్రీ వాంఛూ తన నివేదికలో కూలంకషంగా చర్చించారు. ఈ విషయంలో ఆయన ఇలా అన్నారు:

"పోస్టుగ్రాడ్యుయేట్ విద్యార్థులకు ఆర్ట్సు, సైన్సు, నేర్పే కళాశాలల విషయంలో ఆంధ్రులకు శేషించిన మద్రాసు రాష్ట్రప్రభుత్వం ప్రత్యేక హామీలు ఇవ్వవలసిన అవసరంలేదు. న్యాయశాస్త్రం, వైద్యశాస్త్రం మొదలయిన శాంకేతిక, వృత్తివిద్యాశిక్షణాలయాలలో ఆంధ్రులకు ప్రత్యేక సౌకర్యాలు ఏర్పాటుచెయ్యాలి. పశుచికిత్సా వైద్యాలయం, కింగ్ ఇన్‌స్టిట్యూట్ వంటి ప్రత్యేక సంస్థలు ఒక రాష్ట్రంలోమాత్రమే నెలకొల్పబడినవి. ఆంధ్రప్రాంతంలో అటువంటివి లేనే లేవు. ఇటువంటి విద్యాసంస్థలలో ఆంధ్రులకు నూటికి 36 స్థానాలు వచ్చే 25 సంవత్సరాలపాటు లభించగలవని చట్ట రీత్యా హామీ ఇవ్వాలి.

కేవలం ఒక రాష్ట్ర ప్రజలకు మాత్రమేగాక ప్రజలందరికీ శిక్షణనిచ్చే వైద్యకళాశాలలు, ఇంజనీరింగు కళాశాలల విషయంలో తమరాష్ట్రంలోనున్న విద్యాసంస్థలలోని స్థానాలన్నీ తమ రాష్ట్రవిద్యార్థులకే లభించేటందుకూ, అవశిష్ట మద్రాసురాష్ట్రంలోనివిద్యాసంస్థలలో ప్రస్తుతవున్నదిరాష్ట్రంలో ఆంధ్రవిద్యార్థులకు లభించే స్థానాలు ఇంకముందు కూడా లభించడానికి ఆంధ్రప్రభుత్వం శ్రద్ధ వహించాలి. ఈవిధంగా వున్నదేరాష్ట్రంలో ప్రస్తుతం ఆంధ్రులకు లభిస్తున్న స్థానాలు ఇకముందు కూడా లభించే యేర్పాటు జరగాలి. ఆంధ్ర విద్యార్థులకు అవశిష్ట మద్రాసురాష్ట్ర విద్యాసంస్థలలో యీపద్ధతి ననుసరించి పదిహేను సంవత్సరాలవరకు ప్రత్యేకంగా కేటాయించాలని వాంఛూ నివేదిక కోర్కొంటున్నది. కళాశాలలో చేర్చుకునే విద్యార్థులను ఆయాకళాశాలలు ఏరాష్ట్రంలో వున్నవో ఆరాష్ట్ర ప్రభుత్వంగాక, ఆయావిద్యార్థులు ఏరాష్ట్రంవారో ఆరాష్ట్ర ప్రభుత్వమే ఎన్నుకోవాలి.

### రాయలసీమ కళాశాలలు

రాయలసీమ కళాశాలలను గురించి ఆనివేదికలో ఇలా వున్నది:

ప్రస్తుతం రాయలసీమ అయిదు జిల్లాలలోని కళాశాలలు మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వున్నవి. ఆంధ్రరాష్ట్ర మేర్పడగానే రాయలసీమ కళాశాలలు ఆంధ్రవిశ్వవిద్యాలయానికి మార్చబడవచ్చు. అటువంటిచే జరిగేపక్షంలో రాయలసీమ కాలేజీలలో చదివే విద్యార్థులు కనీసం ఒక సంవత్సరంపాటు, అవసరమైతే మూడేండ్లవరకు మద్రాసు విశ్వవిద్యాలయం పరీక్షలకు హాజరయ్యే యేర్పాటు చేయడ మవసరం.

ప్రభుత్వ విద్యాసంస్థలలో విద్యార్థులను చేర్చుకునే విషయంలో ఆంధ్రుడనే పదానికి ఈ క్రింది నిర్వచనం వర్తింప చెయ్యాలని వాంచూ నివేదికలో వున్నది.

"కొత్త రాష్ట్రంలో నివసించే వారందరిని ఆంధ్రులుగా పరిగణించాలి. వారు ఏభాష మాట్లాడుతున్నారనే విషయానికి ప్రాముఖ్యం ఇవ్వరాదు. తమిళం, తెలుగు, కన్నడం, మలయాళీ భాషలలో ఏభాష మాట్లాడేవారైనా అవశిష్ట మదరాసు రాష్ట్రంలోని వారిని ఈ విషయంలో ఆంధ్రేతరులుగా పరిగణించాలి."

మదరాసునగరంలోని ఆస్పత్రిలో చికిత్సా సదుపాయాలు ప్రత్యేకించే సూచనను శ్రీవాంఛూ తన నివేదికలో తీవ్రంగా నిరసించారు. అయా ఆసుపత్రులలోని డాక్టర్ల నిర్ణయాల ననుసరించి "మొదట వచ్చిన వారిని మొదట చేర్చుకునే" పద్ధతిలో ఆయా ఆసుపత్రులలో రోగులను చేర్చుకోవాలి. ఒక ఆసుపత్రిలో ఆంధ్రేతరుల చికిత్సకుగాను ఒక మంచం కేటాయించబడినదనే కారణాన ఆంధ్ర రోగికి చికిత్సా సదుపాయం నిరాకరించరాదు. అలాగే ఆంధ్రులకు కొన్ని మంచులు కేటాయించామనే నెపంతో ఆంధ్రేతరులకు చికిత్స నిరాకరించరాదు.

ఆటు పిమ్మట శ్రీ వాంచూ తన నివేదికలో ఆర్థిక విషయమును చర్చించి ఆంధ్రరాష్ట్రం యొక్క ఆదాయం పెంపుదలకు కొన్ని సూచనలను తన నివేదికలో పరిశీలించారు. మద్యనిషేధం రద్దుచేయడం ఆసూచనలలోఒకటి. ఈ విషయం గురించి శ్రీ వాంచూ ఇలా అన్నారు.

"ఎక్సైజు పన్ను వల్ల వచ్చే ఆదాయం వినా, జాతీయాభివృద్ధి ప్రణాళికలు, పంచవర్షాభ్యుదయ ప్రణాళికలనూ అమలు జరపడానికి కొత్త రాష్ట్రానికి ధనం లభించదు. ఎక్సైజు పన్ను వల్ల ఈ ప్రణాళికలకు కొత్త ప్రభుత్వం ఆదాయం సేకరించాలి, లేదా కేంద్ర ప్రభుత్వం వద్దగాని, ప్రజల వద్దగాని రుణాలు సేకరించాలి.

"కనుక ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన మొదటి రోజులనుంచీ ఆంధ్రరాష్ట్రం దివాలాతీసే పరిస్థితులు ఏర్పడకుండా వుండాలంటే తమ రాష్ట్రంలో మద్యనిషేధం రద్దుచేసే విషయంగురించి తీవ్రంగా ఆలోచించాలని ఆంధ్ర నాయకులకు నేను సలహా యిస్తున్నాను."

తుదకు ఆంధ్రరాష్ట్ర బడ్జెటులో సుమారు అయిదు కోట్ల రూపాయల లోటు వస్తుందనీ, ఏవో కొన్ని ఖర్చు తగ్గింపు పద్ధతుల నవలంబించడంవల్ల ఈ లోటును రెండున్నర కోట్లవరకు తగ్గించవచ్చనీ శ్రీ వాంచూ తన నివేదికలో పేర్కొన్నారు.

### ఉద్యోగుల విభజన

ప్రభుత్వోద్యోగుల విభజనను గురించి శ్రీ వాంచూ తన నివేదికలో కూలంకషంగా చర్చించారు. స్టేట్ అండ్ సబార్డినేట్ సర్వీసులలోని ఉద్యోగులకు ప్రత్యేక రక్షణ నిబంధనలు శ్రీ వాంచూ సూచించారు. ఇందుకు వీలుగావున్నదిమదరాసురాష్ట్రంలోని వుద్యోగులను నాలుగు తరగతులుగా విభజిస్తున్నారు. ఆ తరగతులివి: జిల్లాలలోను, రాష్ట్రప్రభుత్వ కార్యాలయాలలోను ప్రస్తుతం పని చేస్తున్న గెజిటెడ్ వుద్యోగులు, రాష్ట్ర ప్రభుత్వ శాఖలకు అనుబంధంగ ఆయా ప్రాంతాలలో పని చేస్తున్న నాన్ గెజిటెడ్ వుద్యోగులు, గెజిటెడ్ ఆఫీసర్ల హోదాతో పని చేస్తున్న రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు, కేంద్ర ప్రభుత్వోద్యోగులు, ముందు నియమించబడనున్న ఉప సంఘంవారు ఈ వుద్యోగుల విభజన విషయం వివరంగా పరిశీలించవచ్చని ఈ నివేదిక సూచిస్తున్నది.

ప్రస్తుతం ప్రభుత్వ శాఖలలో శాశ్వతోద్యోగులుగా పని చేస్తున్న వారినీ, ముందు శాశ్వతోద్యోగులుగా ఖాయం చేసే వుద్దేశంతో సర్వీసెస్ కమిటీవారిచేత ఎన్నికయి ప్రస్తుతం ప్రొబేషన్ పద్ధతిలో పనిచేస్తున్న వుద్యోగులను, ఆంధ్ర, అవశిష్ట మద్రాసు రాష్ట్రాలు పంచుకోవాలనేది వుద్యోగుల విభజనలో అనుసరించ దగ్గ మొదటి సూత్రం. వీరిలో ప్రొబేషన్ వుద్యోగులలో రెండు తరగతులవారున్నారు. రెండు సంవత్సరాలపాటు పని చేసి, వుద్యోగులు ఖాయం చేయబడవలసిన వుద్యోగులు మొదటి తరగతికి చెందుతారు. ఏవో ఖాళీలురాగా, వాటిలో ప్రస్తుతం తాత్కాలికంగా పనిచేస్తూ ఇంకా రెండేళ్ళ సర్వీసు పూర్తికాని వుద్యోగులు రెండవ తరగతికి చెందుతారు. ఈ రెండురకాల ప్రొబేషన్ వుద్యోగులుకాక, ఏవైనా ఖాళీలు వచ్చే సందర్భంలో ఆ ఖాళీలలో నియమించడానికి అర్హతగల వుద్యోగుల జాబితా (వెయిటింగ్ లిస్టు) మరొకటి వున్నది. ఉద్యోగుల విభజనకు సంబంధించినంతవరకు ఈ వెయిటింగులిస్టులోని వుద్యోగులను ఖాయపు ఉద్యోగాలకు ప్రభుత్వం తీసుకున్నట్లు పరిగణించరాదని వాంఛూ నివేదిక సూచిస్తున్నది.

### సమపుజ్జీ విధానం

ఉద్యోగుల విభజన విషయంలో గమనించ వలసిన రెండవ విషయం ఏమిటంటే విభజన పూర్తయిన తరువాత రెండు రాష్ట్రప్రభుత్వోద్యోగాలలోను వీలయినంతవరకు ఆయా వుద్యోగులు సమపుజ్జీ పద్ధతిలో వుండాలి. ఈ పద్ధతి సక్రమంగా అమలు జరగడానికి వీలుగా వివిధ ప్రభుత్వ శాఖలలోని వుద్యోగులలోను, తదితరులలోను మూడేండ్లలేక అయిదేండ్ల సర్వీసుగల వారిని ఒక గ్రూపుగ పరిగణించి విభజన జరపాలి.

ఈ విషయం గురించి శ్రీ వాంఛూ యిలా పేర్కొన్నారు:

"వివిధ ప్రభుత్వశాఖలకు ఉద్యోగస్థులను ఎన్నుకునే విషయంలో తమకు తగినంత న్యాయం జరగలేదని ఏ కారణంవల్లనైతేనేం ఆంధ్రులు భావిస్తున్నారు. వారిలా భావించడం న్యాయమా అన్యాయమా అనే విషయం పరిశీలించడం నాపని కాదు. కాని గమనించవలసిన వాస్తవం ఏమిటంటే ప్రస్తుత ప్రభుత్వశాఖలలో తగినంతమంది ఆంధ్రులు లేకపోవడం. నవ్యాంధ్ర రాష్ట్రం ఏర్పడుతున్న యీ తరుణంలో జరుగనున్న విభజన సందర్భంలో ఈ విషయం దృష్టిలో పెట్టుకోవాలి.

"కనుక వుద్యోగుల విభజన విషయంలో నేను సూచించే మూడవ సూత్రం ఏమిటంటే, ఆయా వుద్యోగుల హోదా సమంగా వుండే పక్షంలో సబార్డినేట్ సర్వీసులకు నేరుగా ఎన్నికయిన యువ వుద్యోగులకు బదులుగా, వయస్సువచ్చిన ఆంధ్ర వుద్యోగులను ఆంధ్రలో నియమించాలి.

"ఈ విషయంలో అనుసరించ దగ్గ మరొక విధానామిది: ఆంధ్రరాష్ట్రం ఏర్పడడంవల్ల కొన్ని శాఖలలోఉద్యోగాల హోదా పెరిగే అవకాశం వున్నది. ఆ విధంగా ఉద్యోగుల సంఖ్య కాని హోదా పెరిగినప్పుడు దాని వల్ల కలిగే ప్రయోజనాలను ఆంధ్రరాష్ట్రానికే యివ్వాలి. ప్రస్తుతం వున్న వుద్యోగుల హోదాను ఎక్కువ చెయ్యడంతో తన అవసరాలు తీర్చుకోవడానికి శేషించిన మద్రాసు రాష్ట్రప్రభుత్వం ప్రయత్నించాలి.

### ఆంధ్రరాష్ట్రానికి ఉద్యోగులు

ఆంధ్రరాష్ట్రానికి కావలసిన వుద్యోగులను కేటాయించే విషయంలో శ్రీ వాంఛూ యిలా సూచిస్తున్నారు:

(1) తమ తమ కుటుంబాలు ఇక ముందుకూడా ఆంధ్ర రాష్ట్రంలోనే వుంటే వారిని ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంలోకి కేటాయించాలి. మాతృభాష గా మరేభాష మాట్లాడుతున్నారనేది ప్రస్తుత విషయం కాదు.

(2) పైన పేర్కొనబడిన తరగతికి చెందని వ్యక్తులనుకూడా, వారు ఇక ముందు ఆంధ్రప్రభుత్వ శాఖలలో పనిచేయడానికి ఇష్టపడితే వారిని కూడా ఆంధ్రప్రభుత్వం తీసుకోవచ్చు.

(3) తెలుగు మాతృభాష గాగల వ్యక్తులను, గత 25 సంవత్సరాలనుంచీ ఆంధ్రరాష్ట్రంలోనే తమ కుటుంబాలుంటున్న వ్యక్తులను ఆంధ్రప్రభుత్వం వుద్యోగాలలో కేటాయించవచ్చు.

(4) పై మూడు పద్ధతులలో వుద్యోగుల కేటాయింపు జరిగిన తరువాత మిగతా వుద్యోగులను ఆంధ్రరాష్ట్రం యొక్క అవసరాలనుబట్టితీసుకోవచ్చు. అయితే ఈ విధంగా మిగిలిన వుద్యోగులలో తెలుగుభాష బాగా తెలిసిన వుద్యోగులు, గతంలో కొంతకాలం ఆంధ్రప్రాంతంలో పనిచేసిన వుద్యోగులు కొంతమంది వుండవచ్చు. అయినా వారు పైన పేర్కొనబడిన 3వ తరగతి వుద్యోగులు కాకపోవచ్చు. అటువంటివారిని ఆంధ్రప్రాంతానికి బదిలీచేసే ప్రాంతానికి ప్రాముఖ్యం ఇవ్వవచ్చు. ఆంధ్రరాష్ట్రంలో తగినన్ని వుద్యోగులులేకపోతే తప్ప పైన పేర్కొనబడిన 1, 2 తరగతులకు చెందిన వుద్యోగులమాత్రం తప్పకుండా ఆంధ్రరాష్ట్రానికి కేటాయించబడాలి.

### ప్రత్యేకరక్షణ నిబంధనలు

ఉద్యోగులకు ప్రత్యేక రక్షణానిబంధనలను ప్రశాంతంగా అమలు జరపడానికి వీలుగా శ్రీ వాంఛూ తన నివేదికలో యీ క్రింది సూచనలు చేశారు.

(1) విభజన అమలులోకివచ్చిన తేదీనుంచి రెండున్నర సంవత్సరాలవరకు రెండు రాష్ట్రాలలోని ఖాయపు టుద్యోగులతో ఎవరినీ ఖాయం చెయ్యరాదు. ఆయా వుద్యోగులు తమ భవిష్యత్తు నిర్ణయించుకోవడానికి కనీసం ఆరు నెలల వ్యవధి ఇవ్వడం అవసరం.

(2) ఒక రాష్ట్రంనుంచి వెళ్ళిపోదలుచుకున్న వుద్యోగులు తమ కిష్టమయిన ప్రాంతానికి వెళ్ళే కాలపు వ్యవధిఅయిన ఆరు నెలలలో ఆయా ప్రభుత్వాలు వారి రక్షణకు తగుచర్య లతీసుకోవాలి.

(3) ఉద్యోగుల విషయంలో విభజన సమయాన ఉభయ రాష్ట్రప్రభుత్వాలు పరస్పరామోదంతో చేసుకొన్న యేర్పాటును కనీసం రెండున్నర సంవత్సరాల పాటైనా అమలు జరపాలి. అయితే ఉభయులకు ఇష్టమైతే ఆపద్ధతిని కొంతవరకు సవరించుకోవచ్చు. ఉద్యోగుల ప్రత్యేక రక్షణ నిబంధనల ననుసరించి కూడా అవసరాన్నిబట్టి ఆరెండున్నర సంవత్సరాలలో చిన్న చిన్న మార్పులు చేయవచ్చు.

### ఆల్ ఇండియా సర్వీసెస్

ఐ. సి. ఎస్., ఐ. పి. ఎస్., ఐ. ఎఫ్. ఎస్., ఐ. ఎ. ఎస్. శాఖలవంటి ఆల్ ఇండియా సర్వీసెస్ విషయంలో తమ ఉద్యోగాల హోదా రెండు రాష్ట్రాలకు వుమ్మడిగా వుండే యేర్పాటు మంచిదని ఆయా వుద్యోగులు తమకోరిక వెల్లడించారు. లోగడ ఇండియాలో అమలులోనున్న సెక్రటరీ ఆఫ్ స్టేట్ వుద్యోగశాఖకు చెందిన వుద్యోగాలు ఇప్పటికి కొన్ని వున్నవి. ఆవుద్యోగుల విషయంలో మాత్రం వారి కోరికను పాటించడం సులభమే. కాని వారి విషయంలో కూడా ఆంధ్రరాష్ట్ర మేర్పడిన మొదటి అయిదేండ్లలో వారి వుద్యోగాలకు ఉమ్మడి హోదా ఇవ్వడం కష్టంగా కనిపిస్తుంది. అయితే ఇటువంటి వుద్యోగస్థులకు రెండు రాష్ట్రాలలో చెలామణి అయ్యే వుమ్మడి హోదా ఇవ్వాలని భారత ప్రభుత్వం నిర్ణయించదలచినట్లయితే ఆవుద్యోగులలో నూటికి 36 మంది ఆంధ్ర రాష్ట్రంలో పనిచెయ్యాలని నిర్ణయించవలసి వుంటుంది. మిగిలిన వారు అవశిష్ట మదరాసు రాష్ట్ర ప్రభుత్వంలో పనిచేయవచ్చు.

ఐ. సి. ఎస్. శాఖకు చెందిన ఆరుగురు న్యాయ మూర్తులు అవశిష్ట మదరాసు రాష్ట్రంలో ఉంటామన్నారు. వీరివల్ల అవశిష్ట మదరాసు రాష్ట్రానికి పెద్ద ఖర్చేమీ వుండదు. కనుక న్యాయమూర్తులను ఈ 2 రాష్ట్రాల మధ్య విభజించే సందర్భంలో వారి కోరికను పరిశీలించవచ్చు.

పోతే ఐ. ఎ. ఎస్., ఐ. పి. ఎస్. శాఖోద్యోగులకు సంబంధించినంతవరకు ఈ 2 రాష్ట్రాలకు వర్తించే హోదా అవుద్యోగులకు ఏర్పాటుచేయడం అసంభవమని వాంచు నివేదికలో ఉన్నది.

ఆంధ్రరాష్ట్ర విభజన జరిగిన తరువాత స్టేట్ అండ్ సబార్డినేట్ సర్వీసుల లోని ఉద్యోగులకు కలిపించవలసిన ప్రత్యేక రక్షణల విషయంలో శ్రీ వాంచూ సూచించిన నిబంధనలలోని ముఖ్య విషయాలివి:

ఉమ్మడి రాష్ట్రంలో విభజనకు పూర్వం పని చేస్తూ, ఆంధ్రరాష్ట్ర మేర్పడిన తర్వాత ఆంధ్ర ప్రభుత్వోద్యోగులలో పనిచేస్తున్న ఆంధ్రేతరోద్యోగి ఉద్యోగుల మార్పిడికి నిర్ణయించబడిన తేదీ నుంచి రెండేళ్ళలోగా అవశిష్ట మదరాసు రాష్ట్రానికి వెళతానంటే ఆంధ్ర ప్రభుత్వం అందుకు అనుమతించాలి. అయితే ఒక సారి అటువంటి నిర్ణయం జరిగిన తర్వాత మళ్లా దానిని మార్చ వీలుండరాదు. ఆంధ్ర ప్రభుత్వోద్యోగానికి బదులు, అయిన ఆంధ్రేతర ఉద్యోగికి బదులు, ఆంధ్రోద్యోగి కోరికను పురస్కరించుకొని ఆంధ్రప్రభుత్వం ఆ ఆంధ్రేతరోద్యోగిని శేషించిన మదరాసు రాష్ట్రప్రభుత్వానికి పంపించాలి. శేషించిన మద్రాసు రాష్ట్రప్రభుత్వం ఆయాఆంధ్రోద్యోగినిరిస్తాలి. ఆంధ్రలో రెండవ నియమించబడిన ఆంధ్రేతరోద్యోగిని తనకు పంపించమని శేషించిన మద్రాసు రాష్ట్రప్రభుత్వం కోరినా,అవసరాన్ని బట్టి మరొక అయిదేండ్ల వరకు తన అధీనంలో వుంచుకొనే యేర్పాటు చాలి. ఇంకొక ముఖ్య విషయమేమిటంటే ఒక ఆంధ్రేతరోద్యోగి ఆంధ్ర ప్రాంతానికి లోగడ బదిలీ అయిన సందర్భంలో ఆయన శేషించిన మద్రాసు రాష్ట్రానికి వెళతానని కోరినా, కోరికపోయినా శేషించిన మద్రాసు రాష్ట్రంలో ఏర్పాటు చేసుకోవడం ద్వారా ఆంధ్ర ప్రభుత్వం ఆయనను మద్రాసు ప్రభుత్వానికి ఇవ్వవచ్చు.

### ఉద్యోగుల సౌకర్యాలు

ఈ నివేదికలో వివరించబడిన నివేదికల ననుసరించి తనకు కలిపింపబడిన సౌకర్యాలు కలిపించబడలేదని ఆంధ్రప్రాంతానికి బదిలీ చేయబడిన ఒక వుద్యోగి ఆంధ్ర ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకున్న సందర్భంలో, ఆంధ్రప్రభుత్వం ఆయన దరఖాస్తును ఆంధ్ర పబ్లిక్ సర్వీసెస్ కమిషను వారికి మద్రాసు పబ్లిక్ సర్వీసెస్ కమిషనువారి పంపించాలి. ఆసంఘాలవారు ఆ దరఖాస్తును పరిశీలించి చేసే సూచనలు తనకు ఆమోదయోగ్యం అయినట్లయితే ఆంధ్ర ప్రభుత్వం తదనుగుణంగా ఉత్తరువు లివ్వవచ్చు. అది కాక వారి సూచనలు ఆంధ్రప్రభుత్వం అంగీకరించలేని పక్షంలో ఆ ఉద్యోగికి మద్రాసు పబ్లిక్ సర్వీసెస్ కమిషన్ వారు వుద్యోగం ఇవ్వాలి.

ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వానికి బదిలీ చేయబడిన వుద్యోగివిషయం తన నిబంధనల ననుసరించి క్రమశిక్షణ చర్య తీసుకునే అధికారం ఆంధ్రప్రభుత్వానికి వుంటుంది.

అయితే అవుద్యోగి ఆంధ్రప్రభుత్వం అర్హ్యార్థన వుద్యోగం స్వీకరించిన రెండేండ్లలోగా అటువంటి క్రమశిక్షణ చర్య తీసుకోవలసి వస్తే ఆంధ్ర ప్రభుత్వం ఆ విషయం గురించి ఆంధ్ర, మద్రాస్ పబ్లిక్ సర్వీసెస్ కమిషన్లను సంప్రతించాలి. వారి నిర్ణయాలతో ఒక వేళ ఆంధ్ర ప్రభుత్వం ఏకీభవించ లేక పోయినట్లయితే ఆ వుద్యోగిని మద్రాస్ పబ్లిక్ సర్వీసెస్ కమిషనుకు స్వాధీనం చెయ్యాలి. వారు ఆ వుద్యోగి విషయం పరిశీలించి తగుచర్య తీసుకొంటారు.

### ఆస్తుల, అప్పుల పంపిణీ

ఆస్తులను ఆంధ్ర అవశిష్ట మద్రాసు రాష్ట్రాలకు పంచే సందర్భంలో 1940 మార్చి 31 కి పూర్వం మద్రాసు రాష్ట్రంలో జరిగిన పనులకు పుస్తకాలలోనున్న విలువలకు రెట్టింపు విలువ కట్టి లెక్క వేయడం సమంజసమని శ్రీ వాంచూ తన నివేదికలో సూచించారు. ఇక ఆ తేదీ తరువాత జరిగిన పనుల విషయంలో ఆ తర్వాత వచ్చిన ఆర్థిక మాంద్య పరిస్థితులను లెక్క వెయ్యకుండా వాటికి చిట్టావిలువలు కట్టాలని శ్రీ వాంచూ నిర్ణయించాలి.

అవిధంగా చేసినట్లయితే 1940 మార్చి 31 వ తేదీ తరువాత ధరలలో వచ్చిన హెచ్చుతగ్గు దృష్ట్యా అస్తులు పంచడం సాధ్యపడుతుందని శ్రీ వాంఛూ పేర్కొన్నారు. గోదావరి,కృష్ణానదులకు ఆనకట్టలు నిర్మించినప్పటికంటే ఈనాడు వస్తువుల ధరలు ఎనిమిది పదిరెట్లవరకు పెరిగి వుండవచ్చు. ఆయితే ఇవి నిర్మించి చాలాకాలమయింది. అందుచేత అవి ఇప్పటికి కొంచెం దెబ్బతిని వుండవచ్చు. కనుక 1940 మార్చి 31 వ తేదీకి పూర్వం జరిగిన ఇటువంటి పనుల విలువ కట్టే సందర్భంలో పుస్తకాల విలువకు రెట్టింపు ధర కట్టడమే సమంజసమని శ్రీవాంఛూ సూచించారు.

### విద్యుచ్ఛక్తి సరఫరా ప్రణాళికలు

పద్ధతి సక్రమమైనదనిరుజువుచెయ్యడానికి శ్రీ వాంఛూ అవశిష్ట మద్రాసు రాష్ట్రంలో 1920 ల ప్రాంతంలో నెలకొల్పబడిన విద్యుచ్ఛక్తి ఉత్పాదక కేంద్రంవిషయం ప్రస్తావించారు. ఇవి నెలకొల్పబడినప్పుడు వస్తువుల ధరలు, కృష్ణాగోదావరి ఆనకట్టలు నిర్మించబడినప్పటికంటె చాలా తక్కువగా లేవు. పైగా అవి నిర్మించి చాలాకాలం కాలేదు. కనుక వీటన్నింటికి కాతాలలోవున్న విలువలకు రెట్టింపు విలువ కట్టడం అన్యాయంకాదని శ్రీ వాంఛూ పేర్కొన్నారు.

ఈవిధంగా శ్రీ వాంఛూ కాపిటల్ ఖర్చుల్ని పెట్టబడిన మొత్తం ఖర్చును లెక్క వేశారు. 1952 మార్చి 31 వరకు ఈపద్దు క్రిందయిన ఖర్చులను శ్రీ వాంఛూ పరిశీలించారు. మొత్తం 8988.36 లక్షల రూపాయల వ్యయముతో జరిగిన పనులవల్ల వచ్చినలాభాలను ఈరెండురాష్ట్రాలకు పంపిణీ చెయ్యాలని శ్రీ వాంఛూ తన నివేదికలో నిర్ణయించారు. ఈమొత్తంలో 3309.67 లక్షల రూపాయలు ఆంధ్ర జిల్లాలలో ఖర్చుచేయబడింది. బళ్లారి జిల్లాఅంతా ఆంధ్రరాష్ట్రానికి సంక్రమించాలని శ్రీ వాంఛూ అభిప్రాయపడ్డారు. కనుక తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణానికి కేటాయించబడిన 587.76 లక్షలు కూడా ఆంధ్రజిల్లాల ఖర్చులలో కలపబడింది. పోతేఅవశిష్ట మద్రాసురాష్ట్రంక్రింద ఈ కాలంలో 5872.69 లక్షల రూపాయలు ఖర్చు చేయబడినట్లు విశదమవుతుంది.

1940 మార్చి 31 కి పూర్వం ఇదే పద్దుక్రింద ఆంధ్రజిల్లాలలో 876 లక్షల రూపాయలు ఖర్చయినవి. అవశిష్ట మద్రాసురాష్ట్రంలో 1,555 లక్షల రూపాయలు ఖర్చయినవి. మొత్తం 2,431 లక్షల రూపాయల ఖర్చయినవి. 1952 మార్చి 31 వ తేదీనాటికి ఆయా పద్దులక్రిందనున్న మొత్తాలకు 1940 మార్చి 31 వరకు ఆయా పనులవల్ల వచ్చినలాభాలకు రెట్టింపు చేసి కలపాలి. 1940 మార్చి 31 కి పూర్వం ఆయా పనులవల్ల వచ్చిన లాభాలను రెట్టింపు చెయ్యాలి. అప్పుడు ఈ పద్దుక్రింద విభజన చేయవలసిన మొత్తం 11118.86 లక్షల రూపాయ లవుతుంది. ఇందులో 4185.67 లక్షలు ఆంధ్ర ప్రాంతానివి, 6927.60 లక్షల రూపాయలు అవశిష్ట మద్రాసు రాష్ట్రానివి.

1951 లో తయారయిన జనాభా లెక్కల ప్రకారం మాస్తే 36.64 నిష్పత్తిలో ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాలకు ఈ ఖర్చులు చేయబడినట్లు తెలుస్తుందని శ్రీ వాంచూ సూచించారు.

ఈ మొత్తాలలో ఏమైనా తేడా వున్నట్లయితే 1952.53 వ సంవత్సరంలో చేయబడిన ఖర్చులను పైమొత్తాలకు కలిపితే ఫలితం ఆంధ్రులకే అనుకూలంగా వుంటుందంటూ శ్రీ వాంచూ ఇలా పేర్కొన్నారు.

"ఇలా చెయ్యడానికి అవశిష్ట మదరాసు రాష్ట్ర ప్రజలకు అభ్యంతరం వుండరాదని నా నమ్మకం. ఎందుచేతనంటే వారిప్రాంతం ఇదివరకే చెప్పుకోతగ్గంతగా అభివృద్ధి చెందినది. విభజన జరిగిన తరువాత వారి బడ్జెటు స్వయం సంపూర్ణంగా వుండడానికి తగిన ఆదాయం వచ్చే పనులు వారి ప్రాంతంలో జరిగినవి."

ఆయా ప్రాంతాలలోని ఆస్తులు ఆయా రాష్ట్రాలకు సంక్రమించ చేస్తే అవశిష్ట మద్రాసురాష్ట్రం ఆంధ్రకు రొక్కంగా పరిహారంచెల్లించే అవసరం వుండదనికూడా శ్రీ వాంచూ పేర్కొన్నారు.

మద్రాసు నగరంలోని భవనాల నిర్మాణానికిగాను ఆంధ్ర రాష్ట్రానికి రావలసిన పరిహారంగురించి ప్రస్తావిస్తూ వాటి పుస్తకాలలోని విలువ 320.24 లక్షల రూపాయలుగా కనిపిస్తున్నదనీ శ్రీ వాంచూ వివరించారు.

1940 మార్చి 31 కి పూర్వం జరిగిన కాపిటల్ ఖర్చు పద్దు విషయంలోవలెనే, ఈ భవనాల కిమ్మతును సరిగ్గా కట్టడానికిగాను వాటికి పుస్తకాలలో వున్న విలువను రెట్టింపుచెయ్యాలని శ్రీ వాంచూ తన నివేదికలో అన్నారు. అవిధంగావాటి విలువ 640.48 లక్షల రూ. లని తెలుస్తుంది. నూటికి 36 వంతులు ఆంధ్రుల ఖర్చన్న లెక్కతో ఇందులో 230.4 లక్షలు ఆంధ్రులకు సంక్రమించాలి.

ఈసందర్భంలో శ్రీ వాంచూ తమ నివేదికలో ఇలా పేర్కొన్నారు:

"పై కారణాలన్నింటివల్లను మదరాసునగరం ఆంధ్రలో చేర్చ బడ లేదు కనుకను, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంతన రాజధాని నిర్మించుకోవడానికి అవశిష్ట మదరాసు రాష్ట్రం ఆంధ్రకు 230.4 లక్షలు రు పరిహారంగా ఇవ్వాలని నేను అభిప్రాయపడుతున్నాను. అవశిష్ట మదరాసు రాష్ట్రం వద్ద ప్రస్తుతం ఇంత రొక్కం లేదు. కనుక ఆంధ్ర ప్రభుత్వానికి విభజనవల్ల రానున్న అప్పునుంచి పైన పేర్కొనబడిన మొత్తం తగ్గించి అవశిష్ట మదరాసు రాష్ట్రానికి ఆ అప్పు కలపడమే ఈ సమస్యా పరిష్కారానికి ఉత్తమ మార్గంగా కనిపిస్తుంది."

అయితే చరాస్తుల పంపిణీ విషయం ప్రస్తావించే సందర్భంలో యీ 2 రాష్ట్రాలలో అప్పుపంచుకోవలసినదనీ ఖచ్చితంగా పైనపేర్కొనబడిన మొత్తం చెల్లించకపోయే అవకాశం ఉన్నదనీ శ్రీ వాంచూ పేర్కొన్నారు.

### చరాస్తులు

చరాస్తుల పంపిణీని గురించి శ్రీ వాంచూ ఇలా అన్నారు:

"1952 మార్చి 31 వ చరాస్తులలో చూపబడిన 1704.76 లక్షల ఆదాయానికి బదులు 1953 మార్చి 31 తే నాటికి సుమారు 10 కోట్ల రు లోటు కనిపించవచ్చని నాకు తెలుస్తున్నది. అలోటును ఉభయరాష్ట్రాలు పంచుకోవలసి వున్నది. కనుక పైన పేర్కొనబడిన 230.4 లక్షల రూపాయల పరిహారం ఆంధ్రకు లభించే అవకాశం కనిపించదు.

1952 మార్చి 31వ తేదీ నాటికి రాష్ట్రం మొత్తానికి 4342.09 లక్షల రూపాయల అప్పువున్నదనీ, ఇందులో 21,78.11 లక్షల రూపాయలు స్థానిక సంస్థలు మొదలయిన వాటినుంచి ప్రభుత్వం రాబట్టుకునే అవకాశం వున్నదని యీ నివేదికలో వున్నది. సర్వసమానంగా 2163.91 లక్షల రూపాయలు అప్పు కనిపిస్తుందనీ ఈ మొత్తాన్ని కూడా 36:64 నిష్పత్తిలో ఉభయరాష్ట్రాల మధ్య పంచాలనీ శ్రీ వాంఛూ సూచించారు.

1953 మార్చి ఆఖరుకు రాష్ట్రం మొత్తానికి పదిలేక పదకొండు కోట్ల లోటు వచ్చే అవకాశం వున్నది కనుక ఆంధ్రరాష్ట్రం మొదటి మూడు నెలలు సక్రమంగా పని చెయ్యడానికి ప్రత్యేక ఏర్పాటు చెయ్యాలని శ్రీ వాంచూ

(5 వ పేజీ చూడుడు)

